


# చేనేత కబురు

ఆగస్టు 2003 సంచిక 4

(For private circulation Only)

మిత్రులారా,

చేనేత కబురు నాల్గవ సంచికకు ఆహ్వానం. ఈ సంచిక తయారవుతున్న దశలో అంటే సెప్టెంబర్‌లో మెక్సికోలోని కాన్‌కున్‌లో ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్లు.టి.ఓ.) అంశాలపై చర్చించడానికి ప్రపంచం సిద్ధమవుతోంది. అయితే ఈ సంచిక మీ చేతికి వచ్చే సరికి సమావేశ నిర్ణయాలు ఏమిటో తెలిసిపోతాయి. ఈ సందర్భంలో ఈ సంచికను చేనేత రంగంపై డబ్లు.టి.ఓ. సంబంధిత జౌళి, వస్త్రాల వాణిజ్య ఒప్పందాల ప్రభావం చర్చించడం ముఖ్యం అనుకున్నాం. దీనికి సంబంధించిన అంచనాలు అందుబాటులో లేవు. ప్రభుత్వాలు గానీ, పరిశోధక సంస్థలు గానీ ఈ పని చేయలేదు. చర్చలో ఉన్న సాధారణ అంశాలను మీ ముందు ఉంచడానికి చిప్ ఈ చిన్న ప్రయత్నం చేస్తోంది.

డబ్లు.టి.ఓ. ఒప్పందంలో చేనేత రంగం వంటి సాంప్రదాయిక పరిశ్రమలకు కొన్ని వరాలున్నాయంటున్నారు. ఈ అంశాలు ఏమిటి, వీటి ప్రభావం చేనేత కార్మికులకు ఏ రకంగా ప్రయోజనకరంగా ఉంటుంది, లేదా ఏ రకంగా ప్రతికూలంగా ఉంటాయి అని చెప్పడానికి భారత్‌లోని ప్రభుత్వాలు ప్రయత్నించలేదు. అయితే చేనేత రంగ ప్రయోజనాలను జాతీయ వాణిజ్య సంప్రదింపుల అంశాలతో సమన్వయం చేయలేదనడం మాత్రం వాస్తవం. నిజానికి చేనేత రంగంపై ప్రభుత్వ వైఖరి ఏమిటో ఎవరికీ అంతుపట్టడం లేదు. మార్కెట్ అడ్డంకులను విశ్లేషించడం, అంతర్జాతీయ ప్రమాణాలను ప్రభావితం చేయడం, చేనేత రంగ ఎగుమతిదారులపై బహుళ పక్ష సంబంధాల ప్రభావం ఏమిటో కనిపెట్టడం సులభం కాదని అందరూ అంగీకరిస్తారు. భారత జౌళిరంగ పునర్నిర్మాణం నుంచి చేనేత రంగాన్ని ప్రభుత్వం పనిగట్టుకుని మినహాయిస్తున్న దశలో ఇది మరింత కష్టమైన పని. ఈ దేశంలో కోట్లాది మంది చేనేత కార్మికుల ప్రయోజనాలను చిన్న చూపు చూస్తున్నారు. 2004 తర్వాత స్వేచ్ఛా జౌళి వాణిజ్య విధానం అమలులోకి వస్తే సవాళ్లను ఎదుర్కోవడానికి వివిధ రంగాలు తమకు తాము పటిష్టం చేసుకోవాల్సిందేనని పాలకుల అభిప్రాయం.

చేనేత రంగం పరిణతి చెందిన పరిశ్రమ. కొంతమంది దీనిని కొడిగడుతున్న పరిశ్రమగా భావిస్తూ ఉండవచ్చు. పరిణతి చెందిన పరిశ్రమల్లో మార్పు విప్లవాత్మకంగా ఉండకుండా క్రమక్రమంగా ఉండే లక్షణం కలిగి ఉంటుంది. అంతే కాక మార్పును ప్రతిఘటించే తత్వం కలిగి ఉంటుంది. తీవ్రమైన మార్పులు సులభంగా రావు. చారిత్రత్మకంగా ఈ పరిశ్రమ ఒక్క చోట గుంపులుగా ఉంది. ఇది 2005 స్వేచ్ఛా వాణిజ్యంలో సముచితమైన పరిస్థితిగానే భావిస్తున్నారు. ఒకే చోట అనేక మగ్గాలుంటే, ఉత్పత్తి అనుగుణంగా సౌకర్యాలు పెరిగే అవకాశాలతోపాటు ఖర్చులు తగ్గుతాయని అంటారు. జౌళి పరిశ్రమతో సంబంధం ఉన్న ఇతర రంగాలు ఇటీవలి కాలానివే. అయితే ఇవి తప్పనిసరిగా మార్పును ప్రతిఘటించేవి కాక పోవచ్చు. అయితే భారత్‌లో ప్రభుత్వాలు మరమగ్గాల రంగంపైనే తమ దృష్టి కేంద్రీకరిస్తున్నాయి తప్ప తగిన చర్యలు తీసుకుని ఎగుమతి అవకాశాలను ప్రోత్సహించడం లేదు. భారత్ నుంచి జౌళి ఎగుమతులకు ప్రధాన ఆధారంగా ఉన్నది చేనేత రంగమే. అంతే కాక చౌక రకం జౌళి దిగుమతులు దేశంలోకి రాకుండా నిరోధించింది కూడా ఈ రంగమే. స్వదేశీ మార్కెట్ల అవసరాలను చేనేత రంగం పూర్తిగా తీర్చింది. అదే సమయంలో అంతర్జాతీయ మార్కెట్‌లో విలువైన ఉత్పత్తుల ఎగుమతికి దోహదం చేసింది. స్వదేశీ జౌళి రంగ బలం ఏమిటో భారత ప్రభుత్వం గుర్తించి ఈ రంగాన్ని మరింత పటిష్టం చేయడానికి అనువుగా తగిన విధాన నిర్ణయాలు తీసుకోవడం మంచిది. చేనేత రంగం ఉత్పత్తుల రక్షణ ప్రాకారంతోనే భారత జౌళి రంగం సమతూకం సాధించగల్గుతుంది. అలాగే చేనేత రంగ ఉత్పత్తి ద్వారా సమకూరే ప్రకంపనలతోనే అంతర్జాతీయ మార్కెట్‌లో పోటీని తట్టుకోగలుగుతుంది.

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

ఈ సంచికలో జౌళి, వస్త్ర రంగంలో అంతర్జాతీయ పరిస్థితిపై అంచనాను అందజేస్తున్నాం. ప్రధానంగా జెనీవాలోని అంతర్జాతీయ వాణిజ్య కేంద్రంలో సీనియర్ డెవలెప్‌మెంట్ ఆఫీసర్‌గా పని చేస్తున్న శ్రీ మాతియాస్ న్నాపి రచనల ఆధారంగానే ఈ అంచనా అందజేస్తున్నాం. ఆయన చిప్ నిర్వహిస్తున్న కార్యక్రమాలకు సహకరిస్తున్నారు. మే 5-6 తేదీల్లో బ్రసెల్స్‌లో జరిగిన జౌళి, వస్త్ర పరిశ్రమల భవిష్యత్‌పై జరిగిన మహాసభపై సంక్షిప్త నివేదికను కూడా పొందు పరుస్తున్నాం. ఈ మహాసభలో 70 దేశాల నుంచి 800 మంది ( వాణిజ్య విధాన నిర్ణేతలు, పారిశ్రామికవేత్తలు, ఎగుమతిదారులు, చిల్లర వ్యాపారులు, దిగుమతిదారులు, విద్యావేత్తలు) పాల్గొన్నారు. 2005 లో కోటాలు అంతరించిన తర్వాత జౌళి, వస్త్రాల భవిష్యత్తు ఏమిటో ఈ సమవేశంలో చర్చించారు. కోల్‌కత్తాలోని కట్స్ సంస్థ, ఆక్స్‌ఫామ్ జి.బి. (ఇండియా) తో కలిసి చిప్ సంస్థ " ప్రపంచీకరణ, ఆర్థిక సరళీకరణ చేనేత రంగంపై దాని ప్రభావం" అన్న అంశాలపై 2003 జూలై 27 నుంచి 29 వరకు హైదరాబాద్‌లో నిర్వహించిన సదస్సు నివేదికను కూడా ఈ సంచికలో పొందుపరిచాం. ఏమైనప్పటికీ ప్రపంచ వాణిజ్యాన్ని శాసిస్తున్న డబ్లు.టి.ఓ. బ్యూరోక్రసీ మన దేశీయ బ్యూరోక్రసీ కంటే జటిలంగా ఉంటుంది. దీనిని అర్థం చేసుకోవడం కష్టం. అందువలన ఈ సంక్లిష్టమైన ప్రపంచ వాణిజ్య వ్యవస్థ నుండి ప్రయోజనాలు పొందడానికి కొంత మంది 'మధ్య దళారులు' అవసరం కావచ్చు. అంతర్జాతీయంగా మార్పులు వస్తున్న సందర్భంగా వచ్చే మార్పులను చిప్ పరిశీలిస్తూ ఉంటుంది. ఈ విషయంలో మీ తోడ్పాటును సహకారాన్ని అర్థిస్తున్నాం

డి. నర్సింహా రెడ్డి

---

## వస్త్రాలు, దుస్తులు పై ఒప్పందం ( ఎ. టీ. సి. )

అనేక దేశాలకు, ముఖ్యంగా వర్ధమాన, కొత్తగా పారిశ్రామీకరణ సాధిస్తున్న దేశాలకు ప్రపంచ జౌళి రంగం చాలా ప్రధానమైంది. ఈ కారణంగా ఇలాంటి రంగంలో మార్పులు భవిష్యత్ రాజకీయ ఎజెండాలో ప్రధాన పాత్ర ఆక్రమిస్తాయి. 2005 జనవరి 1 న జౌళి ఉత్పత్తులు, వాణిజ్యంలో బ్రహ్మండమైన మార్పులు చోటు చేసుకుంటాయి. 2004 డిశంబర్ 31న జౌళి, దుస్తులపై ఒప్పందం అంతమవుతుంది. ఫలితంగా ఈ రంగాలలో వాణిజ్యం మౌలిక మార్పునకు లోనవుతుంది. 2005 నాటికి ఈ రంగం డబ్లు. టి. ఓ. లోని సుంకాలు, వాణిజ్యంపై సాధారణ బప్పందం (GATT) లో పూర్తిగా సమీకృతం అవుతుంది. దీనితో వస్త్రాలు, దుస్తుల వాణిజ్యంలో కోటా పద్ధతి అంతం అవుతుంది. అన్ని కోటాలు అంతం అవుతాయి. మార్కెట్ ప్రవేశ యంత్రాంగంలో కేవలం సుంకాలు మాత్రమే ఉంటాయి. ఈ సుంకాలను కూడా సుంకాల పెరుగుదలను, అత్యున్నత సుంకాలు మొదలైన వాటిని దోహా అభివృద్ధి ఎజెండా పరిధిలో చర్చిస్తారు.

1990 లలో వస్త్రాలు, దుస్తులపై ఒప్పందం కుదిరినప్పుడు వర్ధమాన దేశాల్లోని జౌళి రంగం మరో పదేళ్ల పాటు పునర్నిర్మాణం కొనసాగించడానికి అవకాశం ఉంటుందని అనుకున్నారు. ప్రపంచ వాణిజ్య సంస్థలోని అభివృద్ధి చెందిన దేశాలకు వాణిజ్య అవకాశాలు ఇనుమడించి 2005 నాటికి స్వేచ్ఛ వాణిజ్య వ్యవస్థ ఏర్పడుతుందని కూడా అనుకున్నారు. డబ్లు. టి. ఓ. లో పాల్గొంటున్న 135 దేశాల మధ్య విస్తృతమైన ఏకాభిప్రాయం కొరవడినందువల్ల, యూరప్ సమాజం అనుసరించిన అమోదయోగ్యం కాని విస్తృతమైన ఎజెండా వల్ల, వ్యవసాయ రంగానికి రక్షణ కల్పించడం వల్ల, అమెరికా అనుసరించిన కుంచిత ఎజెండా (జౌళి, వాణిజ్య రక్షణ ఉపకరణాలు, కార్మిక ప్రమాణాల) వల్ల, కైర్న్స్ గ్రూప్ అనుసరించిన కఠిన వైఖరి వల్ల 1999 డిసెంబర్‌లో ప్రారంభమైన బహుళ పక్ష చర్చలు విఫలం అయినాయి.

ప్రపంచ వాణిజ్య బప్పందం ఏర్పడడానికి 1994 ఏప్రిల్ 15 న మర్రకేశ్‌లో జరిగిన ఉరుగ్వే రౌండ్ చర్చల్లో అంతర్గత భాగంగానే వస్త్రాలు, దుస్తులపై ఒప్పందం కుదిరింది. దీనిలో మల్టీఫైబర్ ఒప్పందంతో సహా బహుళ పక్ష ఒప్పందాలకన్న ప్రత్యేకమైన అంశాలు అనేకం ఉన్నాయి. మొట్ట మొదట ప్రపంచ వాణిజ్య సంస్థలో పొందు పరిచినట్టుగా అన్ని సభ్యదేశాలు కట్టుబడి ఉండాల్సిన రీతిలో బహుళ పక్ష వాణిజ్య ఒప్పందంలో వస్త్రాలు దుస్తులపై ఒప్పందం అంతర్భాగమైంది. దీనికి భిన్నమైన విషయం ఏమిటంటే సుంకాలు, వాణిజ్యం పై సాధారణ ఒప్పందం (గాట్) ప్రకారం అయితే సభ్యదేశాలు తాము ఈ వ్యవస్థలో చేరేటప్పుడు తాము కట్టుబడకుండా ఉండే ఏ అంశాన్నించి అయినా మినహాయింపు పొందే అవకాశం ఉండేది. పదేళ్లలోగా ప్రపంచ వాణిజ్య సంస్థలోని అన్ని సభ్య దేశాలు ఒకే రకం సూత్రాలను, నియమాలను అనుసరించాలి. పరిణామ కాలానికి సంబంధించిన అన్ని ప్రత్యేక వెసులుబాట్లు 2005 జనవరి 1 తో అంతం అవుతాయి.

వస్త్రాలు, దుస్తులపై ఒప్పందంలోని ప్రధానమైన అంశం ఏమిటంటే

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

దాన్ని అమలు చేయడానికి ఉద్దేశించిన కార్యక్రమం 2005 జనవరి 1 నాటికి మూడు అంచెలలో ఇప్పుడున్న కోటాలను తొలగించాలి. అంటే క్రమంగా 1995 జనవరి 1 నుంచి, 1988 జనవరి 1 నుంచి 2002 జనవరి 1 నుంచి 2004 డిసెంబర్ 31 వరకు కోటాలనన్నింటినీ తొలగించాలి. ఈ తొలగింపు రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి సమీకృతం చేయడం. రెండు కోటా పెరుగుదలను త్వరితం చేయడం. మరో రకంగా చెప్పాలంటే వివిధ వస్త్రాల రకాలు ప్రపంచ వాణిజ్య సంస్థ నిబంధనల కిందకు చేరతాయి. ఈ రకాలను ఈ క్రింది గ్రూపుల నుంచి ఎంపిక చేస్తారు అవి టాప్స్, నూలు, వస్త్రం, కుట్టిన వస్త్ర ఉత్పత్తులు, దుస్తులు. మిగిలిన 49 శాతాన్ని 2005 జనవరి 1న సమీకృతం చేస్తారు.

కోటా పెరుగుదలకు సంబంధించి 1994 డిసెంబర్ 31 నాటికి అమలులో ఉన్న ఏ ద్వైపాక్షిక ఒప్పందం అయిన 2004 చివరి దాకా అమలులో ఉంటుంది. అయితే ఈ మధ్య కాలంలో సమీకృతం చేసిన ఉత్పత్తులకు ఇది వర్తించదు. ఇంకా మిగిలి ఉన్న కోటాలకు పెరుగుదల రేటును ఒక సూత్రం ప్రకారం పెంచుతారు. ఆ రకంగా మల్టీఫైబర్ ఒప్పందం ప్రకారం 1994 లో 10 శాతం పెరిగితే అది 2002 నుంచి 2004 వరకు ప్రతి ఏటా 18.4 శాతం చొప్పున పెరుగుతుంది. 2005 నాటకి పరిమాణాత్మకపరిమితులన్నీ అంతరిస్తాయి. సుంకాల స్థాయిని ఒప్పంద పాఠంలో పేర్కొనలేదు కాని వీటిని తగ్గించాలని, ఈ తగ్గింపునకు కకట్టుబడి ఉండాలని మాత్రం అంగీకరించారు. యూరప్ సమాజానికి సంబంధించినంత వరకు వస్త్రాలు, దుస్తులపై సుంకాలు ప్రపంచం అంతటికన్న తక్కువగా ఉన్నాయి.

ఈ పరిమితుల తొలగింపునకు పట్టే కాలంలో దిగుమతుల వెల్లువ నుంచి రక్షణ కల్పించడానికి వెసులుబాటు కలిగించారు. దిగుమతి చేసుకునే దేశం ఒక నిర్దిష్ట ఉత్పత్తి దిగుమతి విపరీతంగా పెరిగిందనీ, దీని వల్ల స్వదేశీ పరిశ్రమకు విఘాతం కలిగిందని రుజువు చేయగలిగితే కోటాలను నిర్ణయించవచ్చు. అలాగే సరుకు సరఫరా చేసే దేశాలు సరుకును ఒక చోటి నుంచి మరో చోటికి మార్చాయని అనుకున్నప్పుడు, లేదా రవాణా మార్గాన్ని మళ్లించినప్పుడు, సరుకు ఏ దేశానికి సంబంధించినదన్న అంశం పై తప్పుడు సమాచారం ఇచ్చినప్పుడు, తప్పుడు పత్రాలు అందజేసినప్పుడు దిగుమతి చేసే దేశం తగిన నిబంధనలు అమలు చేయవచ్చు. దీనికి తోడు సిద్ధాంతరీత్యా సవ్యమైన వాణిజ్య నియమాలు పాటించడానికి, మార్కెట్ అందుబాటు అవకాశాలను మెరుగు పరచడానికి చర్యలు తీసుకుంటున్నారు. కొత్తగా ఈ సంస్థలో చేరే దేశాలకు చిన్న మొత్తంలో సరుకు సరఫరా చేసే దేశాలకు, నిరుపేద దేశాలకు ప్రత్యేక మినహాయింపులున్నాయి. అయితే వస్త్రాలు, దుస్తుల వాణిజ్యంపై దుష్ప్రభావం కలిగించే కొన్ని అంశాలు మిగిలే ఉన్నాయి. 2005 జనవరి 1 న వస్త్రాలు, దుస్తుల ఒప్పందం కాల పరిమితి తీరిపోతే ఈ దుష్ప్రభావం గణనీయంగా పెరుగుతుంది. అవి :

ఇంత వరకు ఉన్న వాణిజ్య విధానంలో అయితే సంపన్న దేశాల ఆర్థిక వ్యవస్థలోని మార్కెట్లలో వర్థమాన దేశాలకు నిర్థిష్టమైన వాటా ఉండేది. ఇక మీదట ఈ పరిస్థితి మారిపోతుంది. సంపన్న దేశాలలో సరుకు అమ్మి డబ్బు సంపాదించడానికి వర్థమాన దేశాల మధ్యే పోటీ పెరుగుతుంది. ఇలా పెరిగే పోటీలో విజేతలు ఎవరు, పరాజితులు ఎవరు అనేది ఇంకా తెలియలేదు.

అంతర్జాతీయ వాణిజ్య కేంద్రంలో సీనియర్ మార్కెటింగ్ డెవలప్‌మెంట్ ఆఫీసర్ శ్రీ మాతియాస్ న్నాపి ఇలా అంటారు: "మార్కెట్ మౌలిక అంశాలు మారినప్పుడు అనేక వర్థమాన దేశాలు, పరిణామ క్రమంలో ఉన్న ఆర్థిక వ్యవస్థలు కలిగిన దేశాలు, ముఖ్యంగా దుస్తుల ఎగుమతి మీదే జాతీయ ఆదాయం ఆధారపడి ఉన్న దేశాల ఎగుమతులు గణనీయంగా ప్రభావితం కాక తప్పదు. వాస్తవానికి వ్యాపారంలోనూ, మార్కెట్‌లోనూ నచ్చే మార్పులను ఎదుర్కోవడానికి సర్వసన్నద్ధంగా లేకపోతే వస్త్రాలు, దుస్తుల వాణిజ్యం సరళీకృతం అయినప్పుడు వర్థమాన దేశాలు భారీగా నష్టపోయే ప్రమాదం ఉంది. ఉరుగ్వే రౌండ్‌లో ఆశించినట్లుగా కొత్త ఎగుమతి మార్కెట్లు అందుబాటులోకి రాకపోగా ఉన్న మార్కెట్లనే కోల్పోవచ్చు. ఈ నష్టాలు దోహ అభివృద్ధి ఎజెండా పట్ల ఉన్న కట్టుబాటునే బలహీనపరచవచ్చు. దేశాలు, సంస్థలు వస్త్రాలు, దుస్తుల వాణిజ్యంలో నూతన వాస్థవాలను ఎదుర్కొవడానికి సిద్ధపడి ఉండాలి". అయితే 2005 తర్వాత చైనా, ఇండియా తమ మార్కెట్ వాటాను పెంపొందించుకోగలవని ఆశిస్తున్నారు. పాకిస్తాన్ నుంచి కూడా ఎగుమతులు పెరగవచ్చు. ఇతర దేశాల పరిస్థితి ఇంకా అంచనాకు రాలేదు. ఒకే దేశంలో అంతర్గతంగా వ్యత్యాసాలు ఉండవచ్చు. ఎగుమతి కోసం సరుకు తయారు చేసే పరిశ్రమలు ఇతర పరిశ్రమల మీద ప్రయోజనం పొందవచ్చు. ఎందుకంటే కొన్ని పరిశ్రమలకు తగిన ప్రాథమిక, మౌలిక సదుపాయాలు లేవు.

2004 తర్వాత ప్రపంచ వస్త్ర, దుస్తుల మార్కెట్ ఎలా ఉంటుందని ఎవరు నికరంగా చెప్పలేరు కాని కోటా పద్ధతి పోల్గొన్న తర్వాత నికరంగా విజేతలు ఎవరు , పరాజితులు కాబోయేదెవరు అన్న విషయానికి సంబంధించి నిర్థిష్టమైన సూచనలున్నాయని శ్రీ

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

మాతియాస్ న్నాపి అంటారు. ఆయన మూడు ముఖ్యమైన సూచనలను తెలియజేశారు :

1. కోటాల వినియోగం : 2005 కు ముందు తమ కోటాలను పూర్తిగా వినియోగించుకునే దేశాలు ఆ తర్వాత తమ ఎగుమతులను బహుశా పెంచుకోవచ్చు. ఇప్పుడున్న కోటాలను పూర్తిగా వినియోగించుకోలేని దేశాలు మార్కెట్‌లో పెరిగే అవకాశాల వల్ల ప్రయోజనం పొందే అవకాశం ఉండకపోవచ్చు. అందువల్ల కోటా ఎంత సమర్ధంగా ఉపయోగించుకుంటున్నారో పరిశీలించడం అత్యవసరం.

2. సరళీకృత అంశాలను లాభ ప్రదం చేసుకోవడం : 2002 జనవరిలో ఎ.టి.సి మూడవ దశ తర్వాత కనిపించిన మార్పులను బట్టి చూస్తే ఉత్పత్తి విభాగాల సరళీకరణ కారణంగా వచ్చే మార్పులు రాబోయే పరిణామాలకు సూచన కావచ్చు. ఆ సమయంలో అమెరికా ఏడు విభాగాలను డబ్ల్యు.టి.వొ లో సమీకృతం చేసింది. ఆ రకంగా కోటాలను రద్దు చేసి వాణిజ్య లావాదేవీలు విపరీతంగా పెరగడానికి దోహదం చేసింది. సరళీకృతం చేసిన అన్ని కోటా విభాగాల లోనూ చైనా అమెరికా లోని మార్కెట్‌లో తన ఎగుమతులను గణనీయంగా పెంచుకొంది. కొన్ని సందర్భాలలో ఈ పెరుగుదల కొన్ని వందల శాతం ఉంది. ఇతర దేశాలు కొన్ని విభాగాలలోనే ఎగుమతులు పెంచుకొంటే చైనా మాత్రం నేరుగా పెంచుకుంది. దీని వల్ల మధ్యఅమెరికా, అరేబియన్ దేశాలకు నష్టం కలిగింది. తక్కువ స్థాయిలో ఉత్పత్తి చేసే మరికొన్ని దేశాలు మార్కెట్ వాటా కోల్పోయాయి.

3. కీలక ఎగుమతి రాశి : కోటా ఆంక్షలలోలేని వర్ధమాన దేశాలు ఇంతకు ముందు అనుభవంలోకి రాని పోటీ ఎదుర్కొవాల్సి వస్తుంది. ఇంతవరకు చెప్పుకోదగిన ఎగుమతి పరిమాణాలు లేని దేశాలు ప్రపంచ మార్కెట్‌లో ప్రవేశించడం, కొనసాగడం కూడా కష్టం అవుతుంది. కీలక ఎగుమతి రాశి ఒక ప్రధానమైన అంశం అవుతుంది. ప్రపంచ మార్కెట్‌కు సరుకులు అందించే కొద్దిపాటిగా ఉన్న దేశాల నుంచి భారీ అంతర్జాతీయ కొనుగొలుదారులు సరుకులు దిగుమతి చేసుకోకపోవచ్చు.

వర్ధమాన దేశాల ఎగుమతి మార్కెట్లలో మార్పు వస్తున్నప్పటికీ ఈ వాణిజ్యపరమైన తీరుతెన్నులు ఏమిటో ఇంకా పరిశీలించవలసి ఉంది. అయితే, సుంకాలు సాధారణంగా ఆందోళన కలిగించవచ్చు. ముఖ్యంగా ఎక్స్ఛేంజి రేట్లలో మార్పులు వస్తున్నాయి. ఉదాహరణకు ఆసియాలో ఇటీవల మార్పులు వచ్చాయి. సుంకాలను తగ్గించడానికి అయిదేళ్ళుగా చర్చలు జరుగుతున్నప్పటికీ ఎక్ఛేంజి రేట్లలో ఒక్క రోజులో వచ్చిన మార్పులు ఈ సుంకాల తగ్గింపును ఎందుకు కొరగాకుండా చేసే ప్రమాదం ఉంది. సంపన్న దేశాలతోపాటు వర్ధమాన, ఆర్థిక వ్యవస్థలు కూడా పరిరక్షణాత్మక వాణిజ్య వ్యూహాలు అనుసరించవచ్చు. ముఖ్యంగా ఇబ్బడి ముబ్బడి దిగుమతులను నిలువరించే చర్యలు తీసుకోవచ్చు. దురదృష్టవశాత్తు ఈ చర్యల అమలుకు కొంత సమయం పడుతుంది. మధ్య కాలికంగా చూస్తే ఇవన్నీ గణనీయమైన మార్పులకు గురికావచ్చు.

పోటీని నిలవరించే వాణిజ్య పద్ధతుల సమస్య సంకీర్ణమైంది. కానీ దిగుమతులను అడ్డుకొవడం, సబ్సిడీలు ఇవ్వడం, ప్రపంచ వాణిజ్య సంస్థలో నిర్దేశించినట్టుగా స్వేచ్ఛ వాణిజ్యాన్ని తగ్గించే ఇతర వాణిజ్యపరమైన విధానాలు ఈ పద్ధతులలో భాగం. వాణిజ్యపరమైన అడ్డంకులను నిలువరించే నిబంధనలను అమలు చేశారు కాబట్టి అనుచిత వాణిజ్య విధానాలను నిరోధించడానికి సరుకును దిమ్మరించడాన్ని సమానీకరణ సుంకాలు విధించడానికి మాత్రమే పరిమితమవుతాయి. మరో అంశం ఏమిటంటే వివిధ రంగాలకు ప్రభుత్వ మద్ధతు కింద సబ్సిడీలు, ఇతర రకాల సదుపాయాలు కలుగజేయడం. ఉదాహరణకు రెండు దశాబ్దాలకు పై బడి యూరప్ సమాజ మార్కెట్‌లో కృత్రిమ నూలు ఉత్పత్తిదారులకు విస్తృతమైన ప్రభుత్వ మద్ధతు ఉంది.

అసంపూర్ణ పోటీ చాలా ఆందోళన కలిగించే అంశం. కొంత మంది ఉత్పత్తిదారులు ఇతరుల కన్న సమర్ధవంతంగా వ్యవహరిస్తే, వారి మార్కెట్లను విస్తృత పరచుకుంటే, తమ ప్రత్యర్థుల కన్న తక్కువ ధరకు సరుకు అమ్మినా, ఆర్థిక సమస్యలను అధిగమించగలిగితే ఇతర ఉత్పత్తిదారులు మార్కెట్ నుంచి నిష్క్రమించ వలసి వస్తుంది. అందువల్ల ఒక వస్తువును విక్రయించే వారు కొద్దిమంది మాత్రమే ఉన్న మార్కెట్ పరిస్థితి చివరకు గుత్తాధిపత్యం కింద పరిణమిస్తుంది. ఇది మంచిది కాదని, ప్రజా ప్రయోజనాలకు విరుద్ధమైనదని అంటున్నప్పుడు మంచిదనుకుంటున్న పోటీ సమర్ధవంతంగా ఉంటుందా అన్నది ప్రశ్న.

## పర్యావరణ సమస్యలు

జీవసాంకేతిక (బయోటెక్నాలజీ) అనువర్తనపై అనేక అంశాలు లేవనెత్తుతున్నారు. ముఖ్యంగా జన్యుమార్పిడి ప్రక్రియతో కూడిన పంటలు, ఇంకా చెప్పాలంటే ఆస్ట్రా జెనెకా, అవెంటెస్, డో, డ్యూపాంట్,

మోన్‌శాంటో, నొవార్టిస్ వంటి బహూళజాతి కంపెనీల వ్యవహారం విస్తృతంగా చర్చకు వస్తోంది. ఈ అంశాలు నైతికతకు సంబంధించినవి. సాపేక్షికంగా వీటి వల్ల వినియోగదారులకు, పర్యావరణానికి కలిగే ప్రయోజనాలు, ఎదురయ్యే ముప్పుతో పాటు మేధో సంపత్తి హక్కులకు (TRIPS) చెందిన వాణిజ్య సంబంధిత అంశాలు ఒప్పందం మొదలైనవి చర్చకు వస్తున్నాయి. ఈ అంశాలు ఉరుగ్వే రౌండ్ చర్చల్లో బహుళ పక్ష వాణిజ్య ఒప్పందాల సందర్భంగా ప్రస్తావనకు వచ్చాయి. ఉదాహరణకు ప్రకృతి సంబంధమైన నారకు సంబంధించి అమెరికాలో మూడింట రెండు వంతుల జెనిటిక్ ఇంజనీరింగ్ ద్వారా సాధించిన విత్తనాలు నాటారు. అయితే పత్తి పంటను కేవలం నూలు కోసం వాడరని గమనించాలి. పత్తిగింజల నూనెను మానవ వినియోగానికి కూడా వాడతారు. పత్తిగింజలను పశువుల దాణాలో పదార్థంగా వాడతారు. ఆరోగ్యం, భద్రత కోసం కంపెనీల నిబద్ధత అన్నది మాత్రమే తగిన షరతు కాదు.

## పర్యావరణ లేబిలింగ్

వర్ధమాన దేశాల ఎగుమతులు నానాటికీ పర్యావరణ లేబిలింగ్ అవసరాలను ఎదుర్కొంటున్నాయి. అయితే దీని వల్ల సంపన్న దేశాల మార్కెట్లు అందుబాటు దీని వల్ల గణనీయంగా తగ్గుతుందన్న ఆందోళన పెరుగుతోంది. 1999 ఫిబ్రవరిలో యూరపియన్ కమీషన్ అధికారులు సవరించిన కమ్యూనిటీ ఎకో లేబిల్ అవార్డు పథకాన్ని ప్రచురించారు. ఈ అవార్డు కింద జౌళి ఉత్పత్తులకు కమ్యూనిటీ ఇకో లేబిల్ అంశాలను నిర్దేశించారు. జౌళీ ఉత్పత్తులను వస్త్రంతో తయారు చేసిన దుస్తులుగా (బరువు రీత్యా కనీసం 90 శాతం జౌళి నారతో కూడినవి), గృహా అలంకరణ వస్త్రాలు ( అంటే గృహా అలంకరణకు వాడే వస్త్రాలు 90 శాతం బరువు రీత్యా జౌళి ఉత్పత్తులు కలిగినవి), నార మరియు నూలుతో తయారు చేసిన, నేసిన దుస్తులు లేదా గృహా అలంకరణ వస్త్రాలుగా వర్గీకరించారు. జౌళి ఉత్పత్తులలో వాడే ముడి సరుకు, రంగులు, అద్దకం, వీటిని తయారు చేసే పద్ధతి మొదలైన వాటినన్నించికీ పర్యావరణ సూత్రాలు వర్తిస్తాయి. ఇంధన, నీటివాడకం కూడా కమ్యూనిటీ ఇకో లేబిల్ పరిగణనలోకి వస్తాయి. దీనికి తోడు గుర్తింపు పొందిన EMAS లేదా ISO 14001 వంటి పర్యావరణ యాజమాన్య పథకాలను కూడా పరిగణిస్తారు.

బాహ్యా అలంకరణ వస్త్రాలు, గృహావసరాలకు వాడే వస్త్రాలు, సాంకేతిక వస్త్రాలకు కూడా ఈ సూత్రాలు వర్తింప చేయాలన్న చర్చ యూరప్‌లో ఇప్పటికే సాగుతోంది. ఇప్పుడున్న పర్యావరణ సూత్రాలను మరింత సవరించి క్రిమి నాశక రసాయనాలకు కూడా వర్తింప చేసే అవకాశం ఉంది. యూరప్ సమాజం యొక్క పర్యావరణ ఆడిట్ పథకం పర్యావరణాన్ని కపాడడం, ఉత్పత్తి సమాచారాన్ని అందుబాటులో ఉంచడానికి ఉద్దేశించినది. దీని వల్ల ఉత్పత్తి సంస్థల పై అదనపు బాధ్యతలు పడుతున్నాయి. సమాచారం అందుబాటులో ఉండడం, తమ కార్యకలాపాల ప్రభావం పర్యావరణంపై పడకుండా ఉండేట్లు నివారించవలసిన బాధ్యత ఈ సంస్థలపై ఉంది.

## సామాజిక అంశాలు

సామాజిక ఆదాన ప్రదానల వల్ల సామాజిక ఆందోళనలు కొంతవరకు ప్రభావితం అవుతున్నాయి. విభిన్న ఆచారాలు, వైఖరులు, విధానాలు మొదలైన వాటి నుంచి విభిన్న విలువలు ఉత్పన్నమవుతాయి. మారే వైఖరులు, విధానాలు, ప్రవర్తన, చట్టాలు ఉత్పతి అంతస్సంబంధాలపై ప్రభావం చూపుతాయి. ప్రపంచ కమ్యూనికేషన్ వ్యవస్థ వ్యక్తులు తాము చూసే అంశాలకు ఎలా స్పందిస్తారన్న అంశాన్ని నిర్ధారిస్తుంది. బాల కార్మికుల వ్యవహారం మరింతగా చర్చకు వస్తోంది. సామాజిక అంశాల బాధ్యతను సింగపూర్ డిక్లరేషన్ అంతర్జాతీయ కార్మిక సంస్థకు అప్పగించింది. అయితే కార్మిక ప్రమాణాలను పరిరక్షణాత్మక ప్రయోజనాలకు వినియోగించడాన్ని కూడా ఈ డిక్లరేషన్ తోసిపుచ్చింది. కొన్ని దేశాలకు ప్రయోజనకరంగా ఉన్న అంశాలు ముఖ్యంగా వర్ధమాన దేశాలలో తక్కువ ఖర్చుతో ఉత్పత్తులు సాధ్యమయ్యే అంశాన్ని ప్రశ్నించకూడదని కూడా ఈ ప్రకటన స్పష్టం చేసింది.

అయితే పశ్చిమ దేశాల స్వచ్ఛంద సంస్థలు, పత్రికలు, కార్మిక సంఘాలు నైతికంగా సవ్యమైన వస్త్రాలను, దుస్తులను మాత్రమే కొనాలని అంతర్జాతీయ కొనుగోలుదారులపై ఒత్తిడి చేస్తున్నాయి. ప్రతికూల ప్రచారాన్ని తట్టుకోలేక అంతర్జాతీయ కొనుగోలుదారులు ఈ నైతిక ప్రమాణాలను వర్ధమాన దేశాల ఉత్పత్తిదారులకు, కడకు సబ్ కాంట్రాక్టర్లకు కూడా వర్తింప చేస్తున్నారు. అయితే బాల కార్మిక వ్యవస్థను ఎవరు సమర్థించకపోయిన, ఇటువంటి చర్యల్లో ఆందోళన కలిగించే అంశాలు కొన్ని ఉన్నాయి.

మొదటిది సామాజిక చట్టాలను అంతర్జాతీయ స్థాయిలో రుద్దడం నర్మగర్భంగా సామ్రాజ్యవాద ఎత్తుగడేననీ కొందరి అభిప్రాయం. 1999 డిశంబర్‌లో సియాటిల్‌లో జరిగిన సదస్సులో కొన్ని దేశాలు అనుసరించిన వైఖరి దీనికి మంచి ఉదాహరణ అనీ, దీని వల్ల చాలా వర్ధమాన దేశాలు బాధపడ్డాయని కొందరు భావిస్తున్నారు. ఇక రెండో అంశం పశ్చిమ దేశాల విలువలను ప్రపంచ వ్యాప్తంగా ఇతర

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

సంస్కృతులకు విస్తరింపచేయడం. మూడో అంశం ఇలాంటి పరిణామాల ఆర్థిక పర్యవసానం ఏమిటో అంతు పట్టడం లేదు. వీటి వల్ల పేదరికం పెరిగే అవకాశాలు అనేకం ఉన్నాయి.

## కొత్త సవాళ్లు

వస్త్రాలు, దుస్తుల పరిశ్రమలు ఇప్పటికే డబ్ల్యు.టి.ఓ/గ్యాట్ తో సమీకృతం అయినందువల్ల కొత్త మార్కెట్ సవాళ్లను ముందే అవగతం చేసుకున్న దేశాలు, కంపెనీలు మార్కెట్‌లో తమ స్థానం పదిలపరచుకోగలుగుతాయని శ్రీ మాతియాస్ న్యాపీ అంటారు. ఖచ్చితమైన ఆర్థిక సామర్థ్యం, పకడ్బందీగా నిర్వహించిన పోటీ మునుపటి కన్నా ఇప్పుడు ఎక్కువ పరిగణనలోకి వస్తాయి. దీని వల్ల ఈ మార్పులు వచ్చే వీలుంది:

1. పెరుగుతున్న మార్కెట్లు : కొత్త మార్కెట్లు అవతరించవచ్చు. ఇప్పుడున్న మార్కెట్లు మరింత అభివృద్ధి చెందవచ్చు.

2. అంతరించే మార్కెట్లు : అనేక చిన్న దేశాలు నికరంగా ఉన్న మార్కెట్లను కోల్పోతాయి. కాంగ్రెషనల్ టెక్స్‌టైల్ కాకస్‌కు అమెరిగా వాణిజ్య శాఖ సమర్పించిన నివేదికలో పెద్ద కొనుగోలుదారులు తాము దిగుమతి చేసుకునే దేశాల సంఖ్యను 2005-06 నాటికి సగానికి, 2010 నాటికి మరో మూడో వంతుకు తగ్గిస్తాయని తెలియజేసింది.

3. తగ్గుతున్న ధరలు : సరుకు సరఫరా ఎక్కువగా ఉన్న, సరళీకృతమైన మార్కెట్ ఉన్న చోట ధరల తగ్గుదల కొనసాగే అవకాశం ఉంది. 1996 నుంచి అమెరికాలో వస్త్రాలు, దుస్తుల ధరల్లో ఇదే ధోరణి కొనసాగుతోంది. యూరప్, జపాన్, ఇంకా అనేక మార్కెట్ల్‌లో ఇదే పరిస్థితి ఉంది. దీని వల్ల వర్ధమాన దేశాల వాణిజ్యం సన్నగిల్లవచ్చు.

4. సరుకులు దిమ్మరించడం, సమానీకరణ సుంకాలు : సరుకుల దిమ్మరింత, సమానీకరణ సుంకాల కేసులు పెరిగే అవకాశం ఉంది. ఫలితంగా వర్ధమాన దేశాలలోని విజయవంతమైన ఎగుమతిదారులకు ముప్పు ఏర్పడుతుంది. వర్ధమాన దేశాలది ఈ రకమైన భయం అయితే అమెరికా, యూరప్‌లోని పరిశ్రమలు దిగుమతుల భయంతో సరుకుల దిమ్మరింత, సమానీకరణ సుంకాల కోసం ప్రయత్నిస్తున్నాయి.

5. మరిన్ని కస్టమ్స్ తనిఖీలు : 2005 వరకు ఉత్పత్తుల తనిఖీలు పెరుగుతాయని భావిస్తున్నారు. దీనికి తోడు 2001 సెప్టెంబర్ 11 (అమెరికాలో తీవ్రవాద చర్య)తర్వాత పెరిగిన భద్రత అవసరాలు వర్ధమాన దేశాల ఎగుమతులపై ప్రతికూల ప్రభావం చూపవచ్చు.

చివరిగా, 2005 కల్లా పెద్ద ఎత్తున ఉత్పత్తి చేసే చైనా, ఇండియా వంటి దేశాలు కొత్త ఉత్పత్తులను అభివృద్ధి చేసి, కొత్త మార్కెట్లను సంపాదిస్తాయి. అభివృద్ధి చెందిన దేశాల్లోని పరిశ్రమలు మరింతగా దుస్తుల రంగంలో ప్రత్యేక ఉత్పత్తుల దిశగా పయనించి సాంకేతిక, పారిశ్రామిక వస్త్రాలపై దృష్టి కేంద్రీకరిస్తాయి. దేశాల కూటమి స్థాయి వాణిజ్య ఏర్పాట్లు గణనీయంగా ఉంటాయి. అమెరికా, యూరప్ సమాజం, చైనా, జపాన్ దేశాలకు వీటిపై అదుపు ఉంటుంది. పైగా హేతుబద్ధీకరణ ప్రపంచ స్థాయిలో జరుగుతుంది. అనుచిత వాణిజ్య విధానాలు, సబ్సిడీలు కొనసాగే సూచనలున్నాయి. పర్యావరణ అంశాలు కీలకం అవుతాయి. ఈ రంగం అనేక కొత్త సవాళ్లను ఎదుర్కోవాల్సిన మాట వాస్తవమే అయినా వీటిని ఎలా ఎదుర్కోవాలన్నదే ప్రధాన అంశం అవుతుంది.

## 2005 తర్వాత వస్త్రాలు, దుస్తుల భవిష్యత్తుపై మహాసభ, బ్రసెల్స్, 5-6 మే 2003

వస్త్రాల, దుస్తుల రంగంలో అన్ని ముఖ్యమైన దేశాల ఉన్నతాధికారులు ఈ మహాసభకు హాజరయ్యారు. డబ్ల్యు.టి.ఓ. డైరెక్టర్ జనరల్ శ్రీ సుపంచాయ్ పణిచేపక్డి, UNCTAD సెక్రటరీ జనరల్ శ్రీ రూబెన్స్ రక్యుపెరో, యూరపియన్ సమాజం వాణిజ్యకమిషనర్ శ్రీ పాస్కల్ లామీ, బంగ్లాదేశ్, కాంబోడియా, ఇండోనేషియా, మారిషస్, మెక్సికో, పాక్తిసాన్, శ్రీలంక, టునీషియా, టర్కీ, వనౌతు, వియత్నం దేశాలకు చెందిన వాణిజ్య మంత్రులు, అమెరికా, ఇండియా, జపాన్ దేశాలకు చెందిన ఉన్నతాధికారులు యూరప్ దేశాల చిల్లర వర్తక సంస్థలకు, ఉత్పత్తిచేసే కంపెనీలకు, కార్మిక సంఘాలకు, విద్యావేత్తలకు సంబంధించిన ప్రతినిధులు కూడా ఈ మహాసభలో పాల్గొన్నారు.

2005 నుంచి వస్త్రాలు, దుస్తుల వ్యాపారం సమూలంగా మారిపోతుందన్న స్పష్టమైన అభిప్రాయం వ్యక్తం అయింది. సమీకృత జౌళి పరిశ్రమలు, ప్రత్తి పెంపకం సదుపాయాలు ఉన్న పెద్ద దేశాల వారికి కోటాలను నిర్మూలించడం వల్ల ప్రధానంగా ప్రయోజనం కలుగుతుందన్న ఏకాభిప్రాయం వ్యక్తం అయింది.
చైనాకు అన్ని దేశాలకన్నా ఎక్కువ ప్రయోజనం కలుగుతుందని ఆ తర్వాత ఇండియా, పాకిస్తాన్ దేశాలకు కూడా ప్రయోజనం కలుగే అవకాశం ఉంటుందని ఈ మహాసభలో పాల్గొన్న వారందరూ

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

| పట్టిక : జౌళి ఎగుమతులు, మిలియన్ రూపాయలలో | | | | | | |
|---|---|---|---|---|---|---|
| **వస్తువులు** | **సంవత్సరం** | | | | | |
| | *90/91* | *91/92* | *92/93* | *93/94* | *94/95* | *95/96* |
| **నేసిన బట్ట** | **11,965** | **17,067** | **20,492** | **23,863** | **32,093** | **36,729** |
| మిల్లులో తయారు చేసినవి | 6,167 | 7,149 | 8,033 | 9,510 | 12,009 | 14,492 |
| మరమగ్గాలు | 3,233 | 6,474 | 7,710 | 9,310 | 14,046 | 16,610 |
| చేనేత | 1,227 | 1,872 | 2,730 | 2,817 | 3,180 | 2,553 |
| అల్లినవి | 1,338 | 1,572 | 2,019 | 2,227 | 2,858 | 3,075 |
| **మేడ్ అప్స్** | **7,455** | **11,362** | **16,463** | **22,933** | **29,141** | **33,539** |
| మిల్లులో తయారు చేసినవి | 2,554 | 3,130 | 3,249 | 3,306 | 3,654 | 4,891 |
| మరమగ్గాలు | 2,055 | 3,212 | 5,542 | 9,403 | 13,633 | 16,175 |
| చేనేత | 2,846 | 5,020 | 7,606 | 10,161 | 11,794 | 12,360 |
| అల్లినవి | | | 66 | 63 | 60 | 113 |
| **నూలు** | **5,114** | **9,824** | **11,619** | **15,999** | **26,085** | **33,583** |
| కుట్టే దారం | **49** | **67** | **47** | **54** | **31** | **49** |
| దుస్తులు | **30,175** | **43,815** | **64,756** | **85,820** | **97,782** | **103,543** |
| మగ్గంపై అల్లినవి | 20,892 | 29,958 | 41,299 | 55,507 | 67,549 | 66,968 |
| అల్లినవి | 9,283 | 13,858 | 23,457 | 30,314 | 30,233 | 36,575 |
| **మొత్తం నూలు వస్త్రాలు** | **54,758** | **82,134** | **113,377** | **148,670** | **185,132** | **207,444** |
| **రేయన్/దుస్తులు మినహా సింథటిక్స్** | **6,361** | **11,061** | **14,363** | **18,468** | **24,847** | **31,227** |
| నేసిన బట్టలు | 3,464 | 6,155 | 8,081 | 11,775 | 14,992 | 17265 |
| స్పన్ యార్న్ | 649 | 1,772 | 2,320 | 2,557 | 4,441 | 7,289 |
| ఫిలమెంట్ యార్న్ | 117 | 599 | 900 | 450 | 1,202 | 1,888 |
| మేడ్ అప్స్ | 1,253 | 1,727 | 2,023 | 2,648 | 2,900 | 3,503 |
| ఫైబర్ | 540 | 357 | 554 | 395 | 638 | 534 |
| ఇతర వస్తువులు | 339 | 451 | 485 | 644 | 675 | 748 |
| **దుస్తుల మినహా ఉన్ని** | **923** | **1,667** | **3,125** | **4,484** | **3,600** | **4,389** |
| **నూలేతర దుస్తులు** | **16,431** | **19,009** | **23,652** | **28,427** | **41,591** | **44,521** |
| **సిల్క్ (దుస్తులు, మేడ్అప్స్, నేసిన బట్టలు)** | **4,359** | **6,756** | **7,200** | **7,891** | **9,375** | **8,461** |
| **మొత్తం వస్త్రాలు** | **82,833** | **120,626** | **161,716** | **207,940** | **264,543** | **296,040** |
| **మొత్తం ఎగుమతుల అమ్మకం** | **331,662** | **447,882** | **498,330** | **711,339** | **843,310** | **1,085,208** |

ఆధారం ఐ.సి.ఎం.ఎఫ్. నుంచి వస్త్రాల ఎగుమతులు, నూలు వస్త్రాల పరిశ్రమపై గణాంకాల హ్యాండ్ బుక్, న్యూఢిల్లీ, వివిధ సంచికలు, మొత్తం ఎగుమతుల అమ్మకం ప్రపంచ బ్యాంకు నుంచి, ఇండియా సస్టెయినింగ్ రాపిడ్ ఎకనామిక్ గ్రోత్ (1997 సి.ఇ.ఎం.)

భావించారు. మిగతా అన్ని దేశాల భవిష్యత్తు అగమ్యగోచరంగా ఉంటుంది. వర్ధమాన దేశాలకు సరఫరా వైపున అవరోధాలు ఉంటాయి కనుక ఈ అవకాశాలను నికర వాణిజ్యంగా మలచడం ఈ దేశాలకు పెద్ద సవాలుగా పరిణమిస్తుందని ఆర్. రిక్యుపెరో గుర్తు చేశారు. అనేక దేశాలో పోటీపడే సామర్థ్యం మెరుగుపడాల్సిన అవసరం ఉంది. వినియోగదారుడి ప్రవర్తనను బట్టే దిగుమతులు ఎక్కడి నుంచి చేసుకోవాలనే నిర్ణయాలు ఆధారపడి ఉంటాయి. వినియోగదారుడి అవసరాలు, చిల్లర వర్తకుల అవసరాలు వర్ధమాన దేశాలలోని వస్త్రాలు, దుస్తుల ఎగుమతి కంపెనీల అవసరాలను నిర్దేశిస్తాయి. అయితే అన్ని కంపెనీల దిగుమతి అంశాలను

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

నిర్ణయించేది కడకు ధర, నాణ్యత, కోనుగోలుదారు అందజేసే సేవలు, ప్రతిస్పందన, ఏ దేశం ఏ మేరకు ముప్పును ఎదుర్కోగలుగుతుంది, న్యాయపరమైన అవసరాలు ఏమిటి అన్న అంశాలపైనే ఆధారపడి ఉంటాయి. నాణ్యతను ముమ్ముందు రూపొందించుకొవల్సిన అంశంగా పరిగణిస్తున్నారు.

---

**"ప్రపంచీకరణ, ఆర్థిక సరళీకరణ, భారత అసంఘటిత రంగం - చేనేత రంగంపై దృష్టి" అన్న అంశం పై హైదరాబాద్‌లో 2003 జూలై 27 నుంచి 29 వరకు జరిగిన ప్రాంతీయ వర్క్‌షాప్**

చేనేత విజ్ఞాన విధాన కేంద్రం ( సెంటర్ ఫర్ రిసోర్స్ ఎడ్యూకేషన్, హైదరాబాద్ వారి విభాగం), కలకత్తాలోని కట్స్, ఆక్స్‌ఫామ్ జి.బి (ఇండియా) తో కలిసి భారత్‌లోని అసంఘటిత రంగం కోసం వాదించే జాతీయ ప్రయత్నంలో భాగంగా ఈ వర్క్‌షాప్ నిర్వహించారు. చేనేత కార్మికులు, వాణిజ్య వేత్తలు, విద్యావేత్తలు, అధికారులు, స్వచ్ఛంద సంస్థలు, కార్మిక సంఘాలు, వినియోగదారులు ఈ వర్క్‌షాప్‌లో పాల్గొన్నారు.

ప్రపంచంలో వస్తున్న మార్పుల పర్యవసానంగా ప్రభుత్వ విధానాల వలన చేనేత రంగం సంక్షోభంలో ఉన్నదన్న ఏకాభిప్రాయం ఈ సదస్సులో వ్యక్తం అయింది. ఈ రంగంలో ఉపాధి కల్పన అవకాశాలు, చేనేత ఉత్పత్తులకు మార్కెట్ డిమాండ్ ఉన్నందు వల్ల ఈ రంగాన్ని పటిష్టం చేయవలసిన అవసరం ఉందని వర్క్‌షాప్‌లో పాల్గొన్నవారు నొక్కి చెప్పారు. ఈ రంగాన్ని మరింత పోటీతత్వం కలిగి ఉండేట్లు చేయుడానికి, ప్రాథమికంగా ముడిసరుకు అందుబాటులో ఉంచడం, మార్కెట్ యంత్రాంగం, సంక్షేమ కార్యక్రమాలను పటిష్ట పరచడానికి తీసుకోవాల్సిన చర్యలను సిఫార్సు చేశారు.

---

" కోటా విధానం తోలగించడం వల్ల (ఎగుమతుల పెంచుకోవడానికి వర్థమాన దేశాలకు) అవకాశాలు మెరుగుపడతాయని, అదే సమయంలో ముప్పు కూడా ఉంటుందని ( ఎందుకంటే కోటాలుండవు కాబట్టి నికర మార్కెట్టు ఉండవు, పైగా స్వదేశీ మార్కెట్‌లోనే పోటీ పెరుగుతుంది), భారత ఎగుమతుల్లో ఎదుగుదల సాధించడానికి కూర్పు పద్ధతి (అసెంబ్లీ లైన్), ఫ్యాక్టరీ తరహా వ్యవస్థ ఏర్పడాలని, కార్మిక విధానాల్లో మరింత పట్టు విడుపులు ఉండే విధానం అనుసరించాలి" అని ప్రపంచ బ్యాంకు అంటోంది.

ఇటీవల కేంద్ర ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలను చూస్తే ఈ సిఫార్సులను శ్రద్ధగా అనుసరిస్తున్నారని అనిపిస్తోంది. ఈ సిఫార్సుల వల్ల ఈ రంగం పశ్చిమ దేశాల మాదిరిగా మారిపోతుంది. ఈ విదేశీ ఉత్పత్తి వ్యవస్థ ఏర్పడడం వల్ల అనేక సమస్యలు వస్తాయి. పారిశ్రామిక ఉత్పత్తులతో దక్షిణాసియా దేశాల విజయాలను గమనిస్తే కూర్పు పద్ధతి (అసెంబ్లీ లైన్) ఉత్పత్తి విధానం జోలికి వెళ్లకుండా ఉండడమే మంచిది. ఈ దేశాలు అటువంటి ఉత్పత్తి విధానాన్ని, అనుసరించకుండానే ఆధునిక ఆర్థిక వ్యవస్థలో ఒక స్థానాన్ని సంపాదించుకున్నాయి. 2005 తర్వాత పరిస్థితులను ఎదుర్కోవడానికి భారత్‌లో కూడా అనేక మార్గాలు, పద్ధతులు అందుబాటులో ఉన్నాయి. ఇవి మార్కెట్ డిమాండ్‌ను ఎదుర్కోనడానికి ఉపకరిస్తాయి. ప్రస్తుత ప్రభుత్వ విధానాలు భారత జౌళి పరిశ్రమను నాశనం చేస్తాయి. మనకున్న అనుకూల అంశాలను తుడిచి పెడతాయి. పశ్చిమ దేశాల వస్త్రాలను దిమ్మరించడానికి తోడ్పడతాయి.

---

మీ సలహాలు, సూచనలు, ఆలోచనలు మాకు పంపండి.



Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support